# పిట్టపోరు

(నాటిక)

రచన:

గన్నిశెట్టి వెంకటేశ్వరరావు

ప్రకాశకులు:
ఉదయసాహితి పబ్లికేషన్స్
విజయవాడ-1.

# ఇందులోని పాత్రలు

| | | | | |
|---|---|---|---|---|
| రామానుజయ్య : | ఒకభూస్వామి | వయస్సు | 50 | సం॥ |
| నారాయణయ్య : | అతనిబావమరిది | ,, | 40 | సం॥ |
| నాంచారమ్మ : | అతనిచెల్లెలు | ,, | 35 | సం |
| ఏడుకొండలు : | అతనినౌకరు | ,, | [illegible] | |
| పేరయ్య : | పెళ్ళిళ్ళపేరయ్య | ,, | 40 | |

కాలం : వర్తమానం.

ప్రదేశం : బస్తీ.

# గమనిక:

ఈ నాటికకు సంబంధించిన ప్రింటింగ్, పబ్లిషింగ్ హక్కులు ఉదయసాహితి పబ్లికేషన్స్, విజయవాడ-1 వారివి. మిగిలిన శ్రీ. వగైరా హక్కులు గన్నిశెట్టి వెంకటేశ్వరరావు, అత్తోట, తెనాలి తాలూకా వారికి చెందివున్నవి.

[రామానుజయ్య ఇల్లు. తెరఎత్తేసరికి రామానుజయ్య పడకకుర్చీలో పండుకొని పేపరు చూస్తుంటాడు. నీర్కావి ధోవతి, బనీను బొద్దు మీసం, హుందాఅయిన విగ్రహం.]

(కొంచెమాగి, ఏడుకొండలు బయటనుండివచ్చి లోపలికి వెళుతుంటాడు.)

రామా : ఒరేయ్ ఏడుకొండలూ! (బిగ్గరగా పిలుస్తాడు)

ఏడు : (ఆగి) నేనిక్కడే వుండానండీ!

రామా : ఇక్కడే చచ్చావ్రా?

ఏడు : అయ్యా! ఏంది బాబూ?

రామా : లోనికెళ్ళి కొంచెం పొగాకుపాడు పట్రా.

ఏడు : (వెళ్ళి పుగాకు తెచ్చియిస్తాడు)

రామా : (చుట్ట చుట్టుకొంటూ) ఏడుకొండలూ!

ఏడు : బాబూ!

రామా : కేలెండరందుకో—ఇవ్వాళ తారీకెంతో?

ఏడు : ఇయ్యాల పదేను బాబూ.

రామా : (ఉలికిపడి) ఆఁ! ఎంతన్నావ్?

ఏడు : (బిత్తరపోయి) పదేను బాబూ! ఏంది బాబూ?

రామా : నాకాసంగతే గుర్తులేదునుమా! (బిగ్గరగా) ఒరేయ్ ఏడుకొండలూ!

ఏడు : నేనిక్కడే వుండాను బాబూ!

రామా : ఆ అచ్చిని పిలిచి ఇల్లూ, దొడ్డి అంతా శుభ్రం చేయించు.

ఏసు : సిత్తం. (కొంచెమాగి) సంగతేంటి బాబూ!

రామా : ఇవ్వాళ తెనాలినుండి మాధవయ్యగారొస్తున్నార్రా!

ఏసు : మాదవయ్యగోరా! ఆయనోరు బాబూ!

రామా : ఎవరేమిట్రా నీబొంద! ఏసు తాలూకాల్లో యెనుము లేని మోతుబరిరా! మాధవయ్యానాయుడంటే మజా అనుకొన్నావా?

ఏసు : అనుకోలేదు బాబూ! కాని ఎందుకొత్తున్నారాయని ...

రామా : నీ బుర్రలో సరుకు చాలా తక్కువరా!

ఏసు : సిత్తం.

రామా : కాకపోతే ఏమిట్రా! మనింట్లో పెళ్ళికొచ్చిన కుర్రాడున్నాడా?

ఏసు : సినబాబుగారున్నారు గందండీ!

రామా : ప్రస్తుతం వాడి పెళ్ళివిషయంలో బేరాలు జరుగుతున్నాయా ఈ మార్కెట్లో?

ఏసు : సిత్తం. జరక్కపోవటం వేంటి బాబూ! వొకటా! రెండా! వందలకొందల సమందాలు వరసాగ్గా వత్తుంటే!

రామా : (చిరునవ్వుతో) అవునా? మరి ఈ పరిస్థితుల్లో యాభై మైళ్ళ దూరాన్నుండి, ఒక మోతుబరి స్వయానా మన ఇంటికి వస్తున్నాడంటే, ఎందుకొస్తున్నాడో ...

ఏసు : (నవ్వుతూ) తెలిసిందిలెగండి. ఆయనగోరి దగ్గరకూడా పెళ్ళిడుకొచ్చిన బుల్లెమ్మగారుండా రన్నమాట!

రామూ : ఒకళ్ళేం ఖర్మ! ఇద్దరున్నారు యిద్దరు!

ఏసు : ఆఁ! మనకుండా దొక్క బ్బాయేగా బాబూ?

రామూ : ఏడ్చావులే వెధవ తెలివి.

ఏసు : సిత్తం. (కొంచెమాగి) మీపద్ధతి నాకేం నచ్చలేదు బాబూ!

రామూ : ఏం?

ఏసు : లేకపోతే ఏందండి...అమ్మగోరు బతుకు సాలించి ఎడా వెల్లిపోయింది. ఇల్లు సూత్తంటే బోసురు మంటుందా? తొందరగా సినబాబు పెల్లిసేసి, కోడలమ్మను తీసుకొత్తే యిల్లు కలకల లాడుద్దనుకొంటే, మీరేందో వచ్చిన సమందమల్లా ఏదో వంకబెట్టి తిరగ్గొడతంటే, ఎట్టాగండి?

రామూ : తొందరపడితే యెలారా? నిదానించినకొలదీ రేటు పెరుగుతుంటే?

ఏసు : ముక్కొచ్చినోరు యెంతిత్తామన్నారు బాబూ?

రామూ : (చుట్ట ముట్టించి) అబ్బో ఎంతో ఎక్కడిదిరా! వాళ్ళు పాతికలోపుగానే పలుకుతున్నారు.

ఏసు : పాతికంటే, పాతికొందలా బాబూ?

రామూ : ఛ! వంద లేమిట్రా వందలు! వేలురా వేలు!

ఏసు : (గుండెలు కొట్టుకొంటూ) పాత్రికేలే! మరింకేం బాబూ— తొందరగా ముస్తైపొయ్యండి.

రామా : ఒరేయి ఏసుకొండలూ!

ఏసు : అయ్యా!

రామా : (నిదానం చెప్పుతూ) రాజానుజయ్యనాయుడికి కొంచెం కంటేనే చాలు; వాడొక్క సపతరాని వద్దమ్ములు నాగరే, పాత్రికేవేలకు చిన్నిగన్న కెగ్గడుతా! అందులో మనవాడు క్లిష్టపడుకాబోతుంటే......

ఏసు : (అదోలా మొహంపెట్టి) సిత్రం.

(బయటనుండి "ఏయ్ బండబ్బీ! ఆపు నాయనా ఆపు." అన్నమాట—టకా—ఆగిన చప్పుడు వినిపిస్తాయి)

రామా : (కంగారుగా) మనవాళ్ళేనే బండి ఆగిందనుకొంటూ చూర్రా.

ఏసు : (వాకిలిదగ్గరకెళ్ళి) సిత్రం. మన నాంచారమ్మగారు దిగి నారండి.

రామా : (విసుగ్గా) చావకపోయింది! ఇవ్వాళే దిగబడిందే!

ఏసు : (బయటికు చూస్తూ) రాండమ్మగోరూ! పాలబండి కొచ్చినారా?

నాం : అవున్నాయనా! పాడుబండి గంట లేటు. కూర్చునీ కూర్చునీ దుంప తెగిపోయింది.

(లోనికొస్తుంది. సామాన్యమైన వేషం. చేతిలో ట్రంకుం టుంది.)

రామూ : ఏం చెల్లెమ్మా అంతా కులాసా?

నాం : (పెట్టె క్రిందపెట్టి) ఆఁ, ఏదో ఇలాఉన్నాం. నీ వంట్లో ఉసులుగా వుంటుందా అన్నయ్యా? (బెంచీమీద కూర్చుంటుంది. ఏడుకొండలు ట్రంకు తీసుకొని లోపలికి వెళతాడు.)

రామూ : ఫర్వాలేదు. ఉత్తరమయినా రాయకుండా హఠాత్తుగా వచ్చేశావేమిటమ్మాయ్?

నాం : ఏదీ! వారంరోజులనుంచి ఇవ్వాళా రేపా అనుకుంటుంటే ఇప్పటికి సరిపడింది ప్రయాణం. నిజంగా చూస్తున్నాన్రా అన్నయ్యా చాలరోజులతో.

రామూ : అప్పుడు పోనీ. మీ మామగారేమంటున్నాడు?

నాం : ఏమంటాడూ, నన్ను కాల్చుకు తింటున్నాడు! చచ్చిన వాడుగాదు; బ్రతికినవాడుగాదు, మంచానపడి నామీద కొరిగేస్తున్నాడు—పశేగాని సత్తిగాడు పట్నంలోనే చదువుతున్నాడా?

రామూ : ఆ.

నాం : ఉత్తరాలన్నా రాస్తుంటాడా?

రామూ : ఎందుకు రాయడు?

నాం : మరో సంవత్సరమన్నా పెళ్ళి గొడవుందా, లేదురా అన్నయ్యా?

రామూ : వాడి చదువు పూర్తిగావాలిగా! ఇప్పుడు పెళ్ళికేం తొందర?

నాం : నీకేం నీ కలాగే వుంటుంది. ఎదిగినపిల్ల నింట్లో బెట్టు కొని ఎన్నాళ్ళాగుతాం చెప్పు?

రామా : నిజమే మరి.

నాం : అందులో మీా బావ సంగతి తెలియందేముందన్నయ్యా?

రామా : అవును తెలియం దేముంది! వట్టి కయ్యాళి మనిషి.

నాం : ఈసంవత్సరం పిల్లపెళ్ళి చెయ్యాలని గట్టి పట్టుదల మీాదు న్నారు. నువ్వు మొదలకుండా వుంటే, బయట సంబం ధాలెక్కడ చూస్తారోనని భయంగా వుంది.

రామా : చూడనియ్. చూసేవాడు నీవాపితేమాత్రం అగు తాడా ?

నాం : అదేమిట్రా అన్నయా ! నువ్వూ అలాగే అంటావ్ ? (దుఃఖస్వరంతో) అసలు నీ వాలకం చూస్తే నాకు పుట్టింటిఆశ లేకుండా చేసేటట్లున్నావే!

రామా : (చిరాగ్గా) ఇదుగో నాంచారమ్మా, వచ్చిన ఎసం లేదు; అప్పుడే ఏమిటీ గొడవ?

నాం : చూడన్నయ్యా! నువ్వు నా పిల్లని సత్తిగాడికి చేసుకోక పొయ్యావంటే, నేను నుయ్యో గొయ్యో చూచికొని తీరతాను. (చీదేస్తుంది.)

రామా : సరేలే తర్వాత మాట్లాడదాం. నిదానంగా ముందు నువ్వు లోనికెళ్ళి కాళ్ళు మొహం కడుక్కో.

నాం : మాట్లాడే దేముంది; ఏమయినాసరే నీతో అవునని పించుకోవాలి; ఈ ఇంట్లో నేను గంగ ముట్టాలి. అంతే

ముసుగులో గ్రుద్దులా ఎందుకు నాకేమాటా తేల్చి చెప్పు.

రామా : చెబుతాన్లే లోనికెళ్ళు.

నాం : వెడతాన్లే నేవచ్చిందందుకే తెలిసిందా? ఒరేయ్ ఏడుకొండలూ! (అరుచుకొంటూ లోని కెళుతుంది.)

రామా : (అటూయిటూ తిరుగుతూ) పాడుపీడ ఇవ్వాళే దిగిందే! అవతల మాధవయ్యగారొస్తుంటే... (నారాయణయ్య వస్తాడు. ఖద్దరులాల్చి, ధోవతి సన్నగా బానుగా వుంటాయి. చేతిలో బేగ్ వుంటుంది.)

నారా : (వస్తూనే సకిలించి) ఏంబావా ? తీరుబడిగా వున్నట్టున్నావే ?

రామా : (అతణ్ని చూడగానే ఉలికిపడతాడు.) ఇదేమిటోయ్! హఠాత్తుగా వెలిశావు ? తొలకరి మొదపులాగా !

నారా : (నవ్వుతూ) నీకళ్ళేం జిగేల్ మనలేదుగదా !

రామా : అంతమాత్రం తప్పుతుందట్లే ! కూర్చో అంతా కులాసేనా ?

నారా : ఏదో నీదయవల్ల యిలా వున్నాం. నీవంట్లో కులాసాగా వుంటోందా ? (మంచంవాల్చుకొని కూర్చుంటాడు.)

రామా : ఆహా! ఒరేయ్ ఏడుకొండలూ! (కుర్చీమీద కూర్చుంటాడు.)

ఏడు : (లోపలనుండి)అయ్యా!(వచ్చి)ఏంటి బాబూ! ఓనారాయణయ్యగారొచ్చినారే!అంతా బాగుండారా బాబూ?

నారా : ఆ. నువ్వు బాగున్నారా ఏసుకొంటలూ ?

ఏసు : నాబాక్కేంలెగండి. (సంచితీసుకొని లోనికి వెళతాడు.)

నారా : ఏంబావా! కబుర్లేం చెప్పకుండా దిగులుగా కూర్చున్నావు ? కొంపతీసి నేనొచ్చాననా కాదు గదా!

రామా : ఇక్కడేముంటాయి బాబూ కబుర్లు ? బస్తీ నుంచొచ్చావు; నువ్వే చెప్పాలిగాని.

నారా : అఁ. మనసత్యం చదువు ఈసంవత్సరంతో అయిపోగా?

రామా : ఊఁ.

నారా : అసలు మీ అమ్మాయి కూడా రావాలనుకొంది. "అన్నయ్యను చూచి చాలారోజులయ్యింది; నేన్నూ వెడదామండీ!" అని గోలచేసింది. ఇద్దరం బయలుదేరితే ఇంటిదగ్గ రెలాగని నేనే వద్దన్నాను.

రామా : అవున్లే పాపం! చార్జీలు కూడా ఎక్కువవుతాయిగా!

నారా : (నవ్వుతూ) నేనెంత పొదుపుగా కూడబెట్టినా, నీకూ దుక్కి, కోడలికేగా ! నే కట్టుకు పోయ్యే దేముంది గనుకనా !

రామా : అయితే బాగా కూడబెట్టు. (ఇద్దరూ నవ్వుకొంటారు.)

నారా : (జేబులోనుండి సిగిరెట్ తీసి ముట్టించి) ఆ బావా! అసలు నేవచ్చిన పనేమిటంటే...

రామా : తరువాత తీరుబడిగా మాట్లాడుకొందాం గాని, లోనికెళ్ళి స్నానం వగయిరాలు ముగించుకో. ఒరేయ్ ఏసు కొండలూ.

ఎరు : (లోపలనుండి) వత్తున్నానయ్యా.

నారా : ఆఁ ఫర్వాలేదులే. టిఫిన్ దండిగానే పడింది. (కొంచె తూగి) మా అమ్మ బొత్తిగా మంచాన పడిపోయింది బావా! ఏవేళికెలా వుంటుందో! అందుకని ఆమె కళ్ళ ముందరే ఆకాస్త ముచ్చటా జరగాలని గోలచేస్తోంది.

ఎరు : (వచ్చి) వోకుబాబూ ?

నారా : మా అమ్మగార్రా. ఏమైనాసరే, ఈమాఘంలో సత్యానికి, శారదకూ పెళ్ళి చెయ్యక తప్పదు బావా!

ఎరు : కానియ్యండి బాబూ! మా సక్కని జోడా! సిలకా గోరింకల్లాగుంటారు.

నారా : (ముసిముసిగా నవ్వుతూ) ఏం బావా? ఏమంటావ్?

రామా : నాదేముంది బాబూ! అల్లుడూ మామా యిష్టపడితే, నా అభ్యంతర మేముంటుంది?

నారా : వాడిమొఖం వాడిదేముంది! మన మేంచేస్తే వాడు కాదంటాడ గనక? అయినా శారద వాడికేం పరాయి దిగాదుగా! చిన్నప్పట్నించీ...

రామా : అలాగనకోయ్ నారాయణయ్యా! కాలం మారి పోయింది. ఈ మధ్య నాకూ అదే అనిపించింది. "అవి దిక్కులేని ఇళ్ళు అడవితో సమాన మంటారు" పిల్లవాడికి త్వరగా పెళ్ళిచేసి కోడల్ని ఇంటికి తెచ్చుకుందా మని.

నారా : (విచారంగా) అవును బావా! మా చెల్లెలుంటేగా ఇల్లంత కలకల లాడుతుండేది! అందుకనే...

రామా : మరి చెప్పేది సాంతం విను. ఆమాటే వాడికో అంటే "చదువు పూర్తయ్యేవరకూ, అలాంటి పిచ్చి ఆలోచనల్ని చెయ్యవద్ద"ని తెగేసి చెప్పాడు.

నారా : చదువు ఈ ఏటితో ఆఖరేగా? చూడు బావా! నువ్వు నీకొడుక్కే విధంగా నచ్చ జెప్పుకుంటావో నాకెందుకు గాని, ఈ సంవత్సరం ఆకాస్త శుభం జరిపించక తప్పదు!

రామా : నేనూ అదే ఆలోచిస్తున్నాను. ఆ తర్వాత మాట్లాడుకుందాం. నాకొంచెం పనుంది. నేనలా వెళ్ళొస్తాగాని. నువ్విలోగా స్నాన పానాదులు ముగించుకో, (బిగ్గరగా) ఒరేయ్ ఏడుకొండలూ!

ఏడు : నేనిక్కడే వున్నాను బాబూ! (నారాయణయ్యతో) నీలు తోడమంటారా బాబూ?

నారా : ఊఁ.

(ఏడుకొండలు లోనికెళతాడు. రామానుజయ్య ఉత్తరీయం భుజాన వేసుకొని, చుట్టముట్టించి చెప్పులు తొడుక్కొని బయటకెళ్ళి పోతాడు)

నాంచా : (వచ్చి) ఎప్పుడొచ్చావు నారాయణయ్య బావా?

నారా : (చిరునవ్వుతో) ఓ నువ్వా! నాంచారమ్మొదినా! ఎప్పుడు రాక?

నాంచా : నీకంటే రెండడుగులు ముందుగా వచ్చాను. అంతా బాగున్నారా?

నారా : ఆహా! పోలంపనులయ్యాయా నాంచారమ్మ దినా?

నాంచా : జనుము యింకా కొయ్యలేదు బావా! మా అన్నయ్యకు నిముషం తీరటంలేదంటే నమ్ము!

నారా : మరి ప ల్లో వచ్చావు విశేషమేటి?

నాంచా : విశేషాలేముంటాయి! మా అన్నయ్యను వకసారి చూచిపోదామనివచ్చాను. ఏం రాగూడదా?

నారా : ఆఁ ఆఁ ఎంతమాట! అన్నా, చెల్లెలు రాకుండా ఎలా? సరేగాని పిల్ల పెళ్ళిడుకొచ్చిందిగా! ఈ సంవత్సరమన్నా పప్పన్నాలున్నయ్యా?

నాంచా : భగవంతుడు చల్లగా చూస్తే చేద్దామనే అనుకొం టున్నాము. మరి మీ శారద పెళ్ళి ఈ సంవత్సరం చెయ్యావు నారాయణబావా?

నారా : మనచేతుల్లో ఏముంది? ఆరోజు రావద్దూ?

నాంచా : నీకేంలే ఉన్నమహారాజువి! ఎలాగైనా చెయ్యొచ్చు.

నారా : మీరేనా లేనివాళ్లు?

ఏడు : (వచ్చి) మీకు నీల్లు తోడాను బాబుగారూ!

నాంచా : లే బావా స్నానం చెయ్యి. (ప్రొద్దెక్కింది.

(నారాయణయ్య లోనికెళుతూంటాడు. నాంచారమ్మ అతనివంక చూచి మూతి త్రిప్పుతుంది.)

నాంచా : (నెమ్మదిగా) ఒరేయ్ ఏడుకొండలూ.

ఏడు : అమ్మా!

నాంచా : నేను అన్నయ్యతో పెళ్ళివిషయం మాట్లాడడానికొచ్చినట్లు ఈయనకు తెలియనియ్యకు.

ఏడు : అందుకేనేంటప్పగోరూ మీరొచ్చింది?

నాంచా : ఉష్! నిమ్మళంగా మాట్లాడు వింటాడు. అందుకే తేరా!

ఏడు : సరేలెండమ్మా.

నాంచా : వస్తి తంపులమారి మనిషి! మా అన్నయ్య మనసిరి చేస్తాడుసుమా!

ఏడు : సిత్తం.

నాంచా . ఎలాగయినా తనకూతుర్ని మా సత్తిగాడి మెడకు తగిలించాలని చూస్తూన్నాడు.

ఏడు : అవునండీ! వచ్చిరాంగానే అయ్యగారితో ఆరాసకారే వే మాటాడారు.

నాంచా : (ఆదుర్దాగా) మాట్లాడామా? అన్నయ్యేమన్నాడు?

ఏడు : నాను సరిగా ఇనలేదుగానండి; మొత్తాని కయ్యగారు సరిగా సమాధానం సెప్పినట్టు లేదండి.

నాంచా : హమ్మయ్య! ఒరేయ్ ఏడుకొండలూ!

ఏడు : అమ్మా!

నాంచా : ఎవరెంత తన్నుకుచస్తేమాత్రం, నా అన్న నన్ను కాదంటాడట్రా?

ఏడు : ఎట్టాగంటారండి!

నాంచా : ఆయనెంత బావమరిదయితే మాత్రం... అయినా ఇంకేం బావమరిదిలే! మా వదినతోనే పోయింది వాళ్ళకూ మాకూ చుట్టరికం! ఏమంటావు?

ఏడు : (అయిష్టతగా) సిత్తం.

నాంచా : సరేగాని, బయట సంబంధాలేమైనా వస్తున్నయా?

ఏడు : అయ్యో! రాకపోవటంవేంటండీ? వకటా రెండా! వొందలు! వొచ్చేపొయ్యేవోల్లకి తెంపులేదంటే నమ్మండి!

నాంచా : మరి మా అన్నయ్యేమంటున్నాడు?

ఏడు : ఉలకక్కుండా పలకక్కుండా అట్టానేవుండాడు.

నాంచా : చూడు ఏడుకొండలూ! డబ్బాస్తుందంటే ఎవరికయినా ఆశ కలగొచ్చు. అందుకనే, ఏనిముషానెలా వుంటుందో, ఆ కాస్తమాట అనిపించుకొనే వెడదామని వచ్చాను. ఏమంటావ్?

ఏడు : సిత్తం. మా పెద్ద మంచాలోసెనండీ.

నాంచా : మనమ్మాయిని చూచావుగా నువ్వు? ఎలావుంటుందంటావు.

ఏడు : బుల్లెమ్మగోరికేంవండీ? చినిమాటారులాగుంటారు!

నాంచా : మా సత్తిగాడికి తగిందేనంటావా?

ఏడు : ఎంతమాట! సూడముచ్చటెయ్యారుండీ జంట!

నాంచా : ఒరేయ్ ఏడుకొండలూ! నువ్వుకూడా మా అన్నయ్యకు నచ్చజెప్పాలిసుమా!

ఏడు : అంతకం టేనా అస్పష్టమ్మగోరూ!

నాంచా : మా చెట్టునకాసిన జాంపళ్లు తెచ్చాను. నాలు
క్కాయలిస్తాగాని తీసుకెళ్ళి పిల్లలకు పెట్టుకో.

ఏడు : సిత్తం.

నాంచా : సరే, లోపలకెళదాం నడువ్. నారాయణయ్యకు
నైవేద్యం పెట్టాలిగా మరి!

ఏడు : సిత్తం. తప్పేదేంవుందండీ.
(యిద్దరూ లోనికెళుతూంటారు. రామానుజయ్య
హడావుడిగా బయటనుండి వస్తాడు.)

రామా : (బిగ్గరగా) ఒరేయ్ ఏడుకొండలూ!

ఏడు : నే నిక్కడేవుండాను బాబూ!

రామా : బండొచ్చేటయమయ్యింది. వాళ్ళొస్తా(రా!

ఏడు : ఓను బాబూ?

రామా : రెడ్డొచ్చి మొదలాడన్నట్టుంది! ప్రొద్దుటున్నండీ
చెప్పిందేమి(టా?

ఏడు : గెపితిలేదు బాబూ!

రామా : ఎందుకుంటుంది; వళ్ళు క్రొవ్వితేనరి! మాధవయ్య
గారొస్తారని చెప్పలేద(టా?

ఏడు : సిత్తం. మరసిపోయూనండి.

రామా : ఏడవలేకపోయ్యావ్.

నాంచా : మాధవయ్యగారెవరిన్న మ్యూ?

రామా : (కంగారు పడుతూ) ఆయనా...ఆయన...ఆయనొక స్నేహితుడులే (ఏడు కొండలుతో) ఒరేయ్! ఆ మంచం మదీ లోపల పెట్టి, రెండు కుర్చీలు అవీ తెచ్చి వెయ్యి. ఆఁ, చూడు నాంచారమ్మా! కాస్త ఇల్లు వాకిలీ శుభ్రంగా తుడిపించమ్మా. నేను స్టేషనుదగ్గర కెడుతున్నాను. (ఆదుర్దాగా వెళ్ళిపోతాడు.)

నాంచా : (అర్థంగాని మొహం పెట్టి అలాగే నిలబడివుంటుంది)

ఏడు : (కుర్చీలు తెచ్చి సర్దుతూంటాడు.)

నాంచా : ఒరేయ్ ఏడుకొండలూ! ఈ మాధవయ్య దేవుడెవర్రా?

ఏడు : మీాకు తెలవదేంటప్పమ్మగోరూ? మాధవయ్యగోరంటే మా సెడ్డ మోతుబరిలే! ఏడు తాలూకాల కెదురు లేదు. నచ్చలకి నచ్చలు మూలుగుతున్నయంట.

[హడావుడిగా అన్నీ తా సర్దుతూంటాడు.]

నాంచా : [అనుమానంగా] అయితే ఇంతకీ ఆయనెందుకొస్తున్నాడు?

ఏడు : మీాకు తెలవదేంటండీ! ఆయనండి పిల్లలతండ్రిగారండీ!

నాంచా : [విసుగ్గా] సరీగా చెప్పిచావరా?

ఏడు : ఇంకా సెప్పేదేముందప్పమ్మగోరూ! సమందం కాయం చేసుకోటాని కొత్తుండారు.

నాంచా : ఆఁ!

ఏడు : అవునండీ. మన సత్తెం బాబుగోరి కాయన కూతుర్ని త్తారంట.

నాంచా : నిజంగానేనా ఏడుకొండలూ (ఆదుర్దాగా).

ఏడు : ఒట్టు! మీతోడు అప్పమ్మగోరూ!

నారా : [లోపలనుండివస్తూ] ఏమిట్రా ఏడుకొండలూ హడావుడి?

ఏడు : ఇయ్యాలొత్తున్నారు బాబూ!

నారా : ఇయ్యాలవారెవరు?

ఏడు : మనసత్తెమయ్యగోరికి కాబోయ్యే మామగోరండీ. మాదవయ్యగోరని, మా సెడ్డ మోతుబరిలే! ఆఁ,

నారా : ఆఁ! ఏమిట్రా నువ్వు చెప్పేది నిజమేనా?

ఏడు : అవును బాబో. ఇప్పుడేవత్తారు సూర్దురుగా.

నాంచా : (దుఃఖస్వరంతో) చూశావా నారాయణయ్య బావా? మా అన్నయ్య నాకెంత ద్రోహంచేస్తున్నాడో!

నారా : నేనెవరికి చెప్పుకోను నాంచారమ్మొదినా? [కుర్చీలో కూలబడతాడు.]

ఏడు : [నవ్వుతూ] వకల్లకొకల్లు చెప్పుకోండి.

నారా : ఛ! నోర్మూయ్ వెధవగాడిదా! కొంపలుమునిగి సేస్తుంటే నీకు నవ్వులాటగావుందే!

ఏడు : సిత్తం. (లోనికెడతాడు)

నాంచా : చూడు నారాయణయ్య బావా.

నారా : ఏమిటి నాంచారమ్మొదినా?

నాంచా : సత్తిగాడు నాకా స్వయాన అన్నకొడుకు.

నారా : నాకు స్వయాన చెల్లెలి కొడుకు.

నాంచా : అవునా? మరివాడు నాకయినా అల్లుడుకావాలి; లేదా...

నారా : నాకయినా అల్లుడు కావాలి!

నాంచా : అంతేగాని పరాయికిపోవటం బాగుంటుందంటావా?

నారా : ఏ గాడిదంటాడు? అన్నవాణ్ని చెప్పుతీసుకొట్టాలి.

నాంచా : మరి మా అన్నయ్య ధోరణిచూస్తే యిలావుంది.

నారా : ధోరణేముందిలే! వేలకు వేలు కట్నాలొస్తుంటే...

నాంచా అందుకని అయినవాళ్ళని వదులుకొంటాడా?

నారా : ఆ మాట మీ అన్నయ్యనేఅడుగు!

నాంచా : అడక్క నాకేం భయమా? నిలేసి మరీ అడుగుతాను.

నారా : అలాగన్నావ్ బాగుంది. కావాలంటే నేనుకూడా నీకు తోడు నిలబడతాను.

నాంచా : నీకు చెప్పొచ్చేది అదే

నారా : ఏదీ?

నాంచా : ఇప్పుడు మనమిద్దరం ఒక్కమాటమీద నిలబడి, ఆవచ్చే మాధవయ్యగారితో అన్నయ్య వియ్యమందకుండా చూడాలి.

నారా : ఓ! తప్పకుండా. గట్టిగా నిలబడి అడుగుదాం. అడి గుదామేమిటి, పోట్లాడుదాం.

నాంచా : అలాజేస్తే తర్వాత మన విషయం...

నారా : ఆఁ. దానికేమొచ్చెలే! నీపిల్లయితే పకటి నాపిల్ల యితే వకటీనా నాంచారమ్మొదినా?

నాంచా : నీకడుపు చల్లగా నూరేళ్ళుబ్రతుకు నారాయణయ్యబావా!

నారా : సరేగాని, నాంచారమ్మొదినా! నాకడుపులో దేముఁడు గోలపెడుతున్నాడు. అన్నగతప్రాణిని మరి!

నాంచా : అయ్యో! నా మతిమండిపోను, సంభవస్తోవెలోపడి ఆమాటే మరచిపోయాను. పదపద. (ఇద్దరూ లోపలి కెడతారు. కొంచెమాగి బయటనుండి రామానుజయ్య, ఆయనవెనకనే పేరయ్యవస్తారు. పేరయ్య వేషం చెప్పాలు, చంకలోచింకి గొడుగు, చేతిలోసంచీ, చింకికోటు, కొద్దిగా మాసినగడ్డం.)

రామా : రాండి. రాండి. ఇలా కూర్చోండి.

పేర : [కుర్చీమీద కూర్చుంటాడు. ఏడుకొండలు లోపల నుండి వస్తాడు.]

రామా : (బిగ్గరగా) ఒరేయ్ ఏడుకొండలూ!

ఏడు : నేనిక్కడే వుండాను బాబూ!

రామా : ఆ సంచీ అదీ లోపలపెట్టు.

ఏడు : సిత్తం. (పేరయ్యవంకచూచి) దండాలు మాధవయ్య గోరూ!

పేర : (వెకిలిగా నవ్వుతూ) నేను మాధవయ్యగారికి స్వయాన బావమరిదిని. నాపేరు పేరయ్యంటారు.

ఏడు : అట్టాగా? చమించండి బాబూ! మా అయ్యగోరు మాధవయ్యగారొత్తారంటేను. . .

పేర : అవును. వారు రాత్రిబండిలో తప్పకరాగలరు,

ఏడు : సిత్తం.

రామా : నువ్వెళ్ళి పేరయ్యగారికి వేడినీళ్ళు తోడరా ఏడు కొండలూ! (లోనికి వెడుతాడు)

ఏడు : సిత్తం (వెళ్ళబోతుంటాడు)

పేర : ఇదుగో కొండలూ! (నెమ్మదిగా పిలుస్తాడు.)

ఏడు : నాపేరు ఏడుకొండలండీ!

పేర : ఆఁ అదే అదే. నాకు సరిగాగుర్తు లేదులే, యేమీ అనుకోకు.

ఏడు : పరవాలేదు లెగండి.

పేర : ఇదుగో అబ్బాయ్! మాట (ఒళ్ళుగోక్కుంటూ ఉంటాడు)

డు : అయ్యా.

ర : ఇలా దగ్గరగా రా.

డు : (దగ్గరగా వెడతాడు)

పేర : నీళ్ళు కొంచెం వేసి జాస్తిగావుండాలిసుమా! (నెమ్మదిగా చెబుతాడు)

ఏడు : హీ హీ తావరగా నుందేంటి పేరయ్యగోరూ!

పేర : హుష్! బిగ్గరగా అనకోయి బాబూ! నువ్వేదో మంచివాడివని చెప్పాకొంటే...

ఏడు : పరవాలేదు లెగండి. (సంచీ తీసుకొని వెడుతాడు)

రామా : (లోపలనుండి పొగాకుతో వస్తాడు.) చుట్ట కాలుస్తారా?

పేర : వకప్పుడు కాల్చేవాళ్ళలో వాడినేలెండి (జేబులోనుంచి పొడుం డబ్బీతీసి) ప్రస్తుతం ఈ సంఘంలో సభ్యుణ్ణయ్యాను. (పట్టు పీలుస్తాడు)

రామా : మాధవయ్య బావగారుకూడా ఈ బండిలోనే వస్తారనుకొన్నాను. (చుట్ట ముట్టిస్తాడు)

పేర : తప్పక వచ్చివుండే వారేనండి. అనుకోకుండా రాష్ట్ర మంత్రిగారు దయచేశారు ఎలక్షన్‌సీజన్‌గదండీ! వారికి స్వాగతం చేసేవరకూ వుండాలిగా మరి?

రామా : అయ్యో కాదు మరి! పెద్దవారితో పనయ్యె. రాత్రికయినా తప్పక వస్తారంటారా?

పేర : మా మాధవయ్యబావ మాట తప్పటం, అటు సూర్యుడిటుపొడిస్తేనే!

రామా : చిత్తం చూడండి పేరయ్యగారూ!

పేర : అయ్యో!

రామా : మా అబ్బాయినిగురించి నేచెప్పుకోవటం అంతగా బాగుండదనుకోండి—

పేర : ఫర్వాలేదు; సెలవివ్వండి.

రామా : నిజంగా మావాడు బుద్ధికి బృహస్పతి అంటే నమ్మండి.

పేర : చిత్తం ఈసుగొప్ప గోడలే చెబుతాయిగదండి!

రామా : ఇక అందం విషయంలో......ఆ విషయం నేను చెప్పదలచలేను. రండి కావాలంటే అబ్బాయిఫోటో ఇక్కడేవుంది.

పేర : అక్కర్లేదుకూడా. మిమ్మల్నిచూస్తే అబ్బాయిరూపం నా కళ్ళల్లో మెదులుతోంది సుమండి! ఆ బంగారు ఛాయ, ఆ విశాలమయిన నుదురు, చెంపకు చాయదేసి కళ్ళు ఆ ఒడ్డూ పొడుగూ ఒహో!

రామా : (పొంగిపోయి) చూచినట్లుగానే వర్ణించారు.

పేర : మరేమిటనుకొన్నారు మన బుర్రంటే! కర్మగాలి ఈ రోజు నీ స్థితి కొచ్చానుగాని. చిన్నప్పుడు మా తాత గారంటుండేవాడు— "ఒరే పేరినీడూ! నీ తెలివితేటల ముందు రాజాజీకూడా పనికిరాదురా! నీ రాత బాగుంటే, స్వాతంత్ర్యమొచ్చిన తర్వాత నువ్వు తప్పక మంత్రివయితీరతావురా" అని.

రామా : అవును. అంతటి అదృష్టాలుగాకపోలేదు.

పేర : అదృష్ట రేఖ మనచేతిలోనుంచి తొలగిపోయి యిలా ఏడుస్తున్నాను.

రామా : ఇప్పుడుమాత్రం తమకొచ్చిన లోటేమిటిలెండి.

పేర : సరే, అవన్నీ తరువాత ముచ్చటించుకొందాం. (పొడుం పట్టుపీల్చి) ఇక అసలు విషయానికి వద్దాం. రామానుజయ్యగారూ! మన స్థిర చరాస్తుల భోగట్టా కొంచెం యిస్తారా?

రామా : తప్పకుండా. నవరత్న ఖచితమయిన సుక్షేత్రం పది సలభై ఎకరాలుందండి.

పేర : అయ్యా!

రామా : పోతే రెండకరాలు మామిడితోట, ఈ యిల్లు...

పేర : ఊం సెలవివ్వండి (బుర్రాడిస్తాడు.)

రామా : ఏదో తమ దయవల్ల కొద్దో గొప్పో నిలవలోనే వున్నామనుకోండి.

పేర : సంతోషం.

రామా : క్రిందటి సంవత్సరం సరిగ్గా ఈరోజుల్లోనే మా ఇంటావిడ దేహం చాలించింది.

పేర : విచారకరమైన విషయం.

రామా : అందుచేత వాడినొక ఇంటివాడిని చేస్తే భారం తీరిపోతుంది. ఆ తర్వాత రామాకృష్ణ అనుకొంటూ హాయిగా.....

పేర : కాదుమరీ!

రామా : చూడండి వీరయ్యగారూ!

వీర : చిన్నవాణ్ని. తమ్ముడూ అని పిలిచినా యిబ్బంది లేదు.

రామా : ఏదో లోకాచారా న్ననుసరించే గాని, కట్నాలు కానుకలు విషయంలో నాకంతగా పట్టింపు లేదు సుమండీ.

వీర : చిత్తం.

రామా : డబ్బు శాశ్వతమా చెప్పండి? గుణగణాలు, సాంప్రదాయాలు ముఖ్యం గాని.

వీర : ఎలాగయినా తెలిసినవారు.

రామా : ఈమధ్య మరీ వచ్చేపొయ్యే సంబంధాలకు తెంపు లేకుండా వుంది సుమండీ! నలభై వేలిస్తామని, యాభై వేలిస్తామనీ ...... డబ్బొస్తోందిగదా అని అడ్డమయిన వాళ్ళతో చేయి కలుపుతామా!

వీర : ఛాఛా! అందులోనూ తమరా?

రామా : మాధవయ్యగారి మంచి చెడ్డలు విన్నతర్వాత నాకు, అసలు వేరే సంబంధం వేపుకు మనసు పోవటం లేదు.

వీర : చిత్తం.

రామా : చూడండి తమ్ముడుగారూ! మనలో మాట...

వీర : నిరభ్యంతరంగా సెలవివ్వండి.

రామా : ఇలా అడుగుతున్నందుకు మరోవిధంగా అనుకోకు—

వీర : వ్యవహారం నిర్మొహమాటంగా వుండాలనేవాళ్ళ జాబితాలో నేను ప్రథముణ్ణి.

రామా : ఆc, మన బావగారు...ఎంతెపకన్నా పూరగా రంటారు?

పేర : మీ అంకె చెప్పండి?

రామా : వారి ఉద్దేశ్యం తెలియాలిగా?

పేర : చూడండి అన్నయ్యగారూ! ఇదంతా మోజును బట్టి వుంటుందిగాని ఈ పెళ్ళిళ్ళ మార్కెటులో ధరలకు పరిమితేమిటి?

రామా : బాగా అన్నారు.

పేర : మీ హోదా ననుసరించి, మీకు చిన్నతనం లేకుండా, మీకు తృప్తిపడేలా మా బావతో పలికించేవాణ్ణి నేనున్నానుగా! నన్ను కాస్త కనిపెట్టి వుండాలిగాని...

రామా : అలాగన్నారు బాగుంది. ఇక నేనేం మాట్లాడను.

పేర : ఇప్పుడు చెప్పండి మీ ఉద్దేశ్యం?

రామా : ఏమయినా ఒక ముప్ఫయివరకూ...

పేర : ఖాయం.

రామా : ఏమిటి? (పొంగిపోతాడు)

పేర : ముప్ఫయికి చిల్లిగవ్వ తక్కువగాకుండా పలికించటం ఖాయం! మరి నామాట... [నసుగుతాడు.]

రామా : (సంతోషంగా) ఫర్వాలేదు అడగండి.

పేర : పెద్దలు! తమరే సెలవివ్వటం బాగుంటుంది.

రామా : [చిరునవ్వుతో] ఒకటి! సరా?

పేర : పిల్లలు గలవాణ్ని.

రామా : నేనయినా చిన్నచూపు చూడలేదుగా?

పేర : అబ్బే ఎంతమాట! కాని.....ఇంకొక అర కోరదా మనుకొన్నాను.

రామా : సరే. అలాగే.

పేర : (సంతోషంగా పొడుంపీల్చి) ఇంకెందుకు లగ్నం నిశ్చ యించుకోవటమే తరువాయి.....హాచ్చి (తుమ్ము తాడు.) కాని ఒక్కమాట.

రామా : చెప్పండి.

పేర : వ్యవహారమంతా సవ్యంగా నేను నడుపుకొస్తాను. మీరు మాత్రం తొందరపడకండి.

రామా : (నవ్వుతూ) తొందరా? అది మన ఇంట్లోవున్న ఏడు కొండలకూ్కడా లేదే!

పేర : చిత్తం.

రామా : నాకు జపంచేసుకొనే అలవాటొకటుంది. మీరు కొంచెం విశ్రాంతితీసుకోండి; ఒరేయ్ ఏడుకొండలూ! (అనుచుకొంటూ లోపలికెళతాడు.)

నారా : (నెమ్మదిగావచ్చి) నమస్కారమండీ.

పేర : నమస్తే. తమరు.....

నారా : రామానుజయ్య నాయుడిగారికి స్వయాన బావమరిది నిలెండి...మా చెల్లెలునే వారికిచ్చాం.

పేర : సంతోషం.

నారా : మూడంచీ. మీపేరేమిటో నాకు తెలియదుగాని-

పేర : నాపేరు పేరయ్యంటారు.

నారా : ఇదుగో పేరయ్యగారూ! మీకు తెనాలికి బండెన్నింటికి?

పేర : నాలుగింటి కనుకొంటాను. ఏం? మీరూ బండికి వస్తారా?

నారా : నాకా గ్రహచారం పట్టలేదుగాని, మీరు వెంటనే బోంచేసి బయలు దేరితె బండందుతుంది.

పేర : (తెల్లబోయి) అంటే.....

నారా : మీరిక్కడనుంచి వెంటనే వెళ్ళిపోవాలి.

పేర : హీ హీ! సరసమాడుతున్నారా? (వెకిలిగా నవ్వుతాడు)

నారా : (తీవ్రంగా) నిజంగానే అంటున్నాను.

పేర : అన్నన్నండి. మనిద్దరం వరుసకు బావమరదులమవుతాం. అనండి అనండి ఫర్వాలేదు. (నవ్వుతాడు.)

నారా : (స్థాయిపెంచి) పేరయ్యగారూ! పరిహాసంగాదు.

పేర : (తగ్గి) చిత్తం. నాకేం అర్థంగావటంలేదు.

నారా : లేకపోతే, పిల్లడికి మేనరికముండగా, తగుదునంటూ పిల్లనివ్వటానికొచ్చారా?

పేర : [అర్థంగానట్లు చూస్తుంటాడు.]

నారా : ఏం అర్థంగాలా? విపులంగా చెబుతా వినండి నేను పిల్లవాడికి మేనమామని. నాదగ్గర పెళ్ళీడుకొచ్చిన పిల్లవుంది. మా అమ్మాయి పుట్టినప్పుడు౦డీ, మా సత్యానికనె పేరుపెట్టాం. ఇప్పుడు మా బావ డబ్బు కోసం గడ్డితిని, మీమీసంబంధాలు చూస్తున్నాడు. దీనికి పిల్లవాడి ఆమోదముద్ర ఏమాత్రంలేదు. వాడెప్పటికీ నాఅల్లుడే! కాన మహాశయా, మీరు వచ్చిన దారినే దయచెయ్యండని చెబుతున్నాను.

పేర : మరి...... (ఏదో చెప్పబోతాడు)

నారా : (సీరియస్‌గా) మరీ లేదు గిరీ లేదు. వచ్చినందుకు సుష్టుగా భోంచేసి బండెక్కండి. లేదా... [పళ్ళు బిగించి పిడికిలి చూపుతాడు.]

పేర : [వణుకుతూ] అలాగేనండి.

నారా : (భోనికి రెండడుగులువేసి, వెనక్కు తిరిగి) పేరయ్య గారూ!

పేర : అయ్యా!

నారా : మీరు భోంచేసేసరికి జట్కావచ్చి వాకిట్లోవుంటుంది. మీరు మా బావతో ఈ గొడవేమీ చెప్పకుండా...... ఏం తెలిసిందా? (గద్దింపుగా)

పేర : చిత్తం. విపులంగానే చెబుతున్నానుగా! తప్పకుండా ఎక్కుతాను.

నారా : (దగ్గరగావచ్చి) మా బావతో ఈ విషయం చెప్పారో... మీకు మరి తెనాలిజేరే ఆశవుండదు.

పేర : [భయపడుతూ] చి. చిత్తం. అంతవరకూ అఖ్ఖర్లేదు లెండి. [లోపలనుండి నాంచారమ్మ కంఠం వినిపిస్తుంది]

నాంచా : అదీ చూస్తా. నా కంఠంలో ఊపిరుండగా ఆ ఇచ్చే వాడెలా యిస్తాడో; చేసుకొనేవాడెలా చేసుకొంటాడో.

రామా : [లోపలనుండి] ఇదుగో నాంచారమ్మతల్లీ! నీకు పుణ్యముంటుందిగాని, పరాయి పెద్దమనిషిముందు నా పరువు తీయబోకు.

నాంచా : [దగ్గరగా ఎవరుంటే నాకేం భయమూ? ఆ పెద్ద మనిషినే అడుగుతాను; ఇది న్యాయమేనేమో?

పేర : [నారాయణయ్య వంకచూచి, ఆ గొడవేమిటన్నట్లు సైగజేస్తాడు.

నారా : పిల్లవాడి మేనత్త. ముందు నిన్ను సాగనంపితే తర్వాత ఆ విషయం చూచుకొంటాను. మీరు మాత్రం ప్రయాణసన్నాహంలో వుండండి. [బయటకు వెళ్ళి పోతాడు.]

పేర : హమ్మయ్యా! (కూర్చీలో చతికిలబడతాడు)

నాంచా : (మెరుపులావచ్చి) ఇదుగో ఏమయ్యా పెద్దమనిషీ! నువ్వేం ఆడపిల్లల్ని కనుక్కోలేదా? నీ పిల్లలాంటిదిగాదూ నా పిల్లమాత్రం? నీకేమయినా జ్ఞానముంటే, మేనరిక ముండగా పిల్ల నిస్తానని వస్తావా?

పేర : (ఇంతసేపూ హడలిపోతుంటాడు. కొంచెం తేరుకొని) ఇదిగో తల్లీ! భవానీదేవీ!

నాంచా : నాపేరు నాంచారమ్మ.

పేర : ఏ అనాచారమ్మవయితే నాకేంగాని, మీగోడవ లేమీ నాకు తెలియవు నాబుద్ధి గడ్డితిని ఇక్కడకు వచ్చాను. వచ్చినందుకు బాగా శాస్తి జరిగింది. దయచేసి నన్నేమీ అనకండి తల్లీ! నేనిప్పుడే వెళ్ళిపోతున్నాను.

నాంచా : వుంటానంటేమాత్రం వుండనిచ్చేదెవర్లే! (లోపలకు చూస్తూ) ఒరేయ్ ఏడుకొండలూ!

ఏడు (లోపల్నుండి) ఓయ్ నత్తున్నా. (వచ్చి) ఏం టిప్పమ్మ గోరూ?

నాంచా : లోపల పేరయ్యగారి సంచీ వుందిగా వాలు. తెచ్చి వారికివ్వు.

ఏడు : దిరీసు మాకునుకుంటారా బాబూ?

నాంచా : ఏదోవకటి తగలడతార్లే, నీకెందుకు; తెచ్చివ్వు.

ఏడు : (పేరయ్యతో) ముందు తానం సెయ్యండీ.

పేర : (ఏదో చెప్పబోతాడు! కాని, నాంచారమ్మవంక చూచి ఆగిపోతాడు.)

నాంచా : తెచ్చివ్వరా అంటుంటే...(గదమాయిస్తుంది)

ఏడు : సిత్తం. (అనుమానంగా లోనికెడతాడు.)

పేర : (గొంతు సవరించుకొని) ఇదుగో కనకదుర్గమ్మగారూ!

నాంచా : నా పేరు నాంచారమ్మయ్యా బాబూ!

పేర : ఏదయితేంలెండి. కాని ఒక్కమాట.

నాంచా : ఏమిటది?

పేర : నేను వెళ్ళిపోవటం ఎలాగూ ఖాయమనుకోండి, కాని...

నాంచా : కాని?

పేర : పన్నెండు దాటుతోంది—ఇది చూస్తే పల్లెటూరు. భోజన హోటళ్ళేమీ యిక్కడ వున్నట్లు లేదు. అందుచేత...

నాంచా : (తీవ్రంగా) అందుచేత?

పేర : అహ ఏం లేదు...

నాంచా : ఇదుగో పేరయ్యగారూ! ఈ తంతులన్నీ నాకు తెలుసుగాని, ఇలా దారిన బొయ్యే దానయ్య లందర్నీ మేపితే, రేపు నాకూతుకు బొచ్చెపట్టుకు తిరగాల్సిం దే! ఆ పప్పులేం ఉడకవుగాని దయచెయ్యండి.

పేర : చిత్రం. భోజనాని కిబ్బందని...

నాంచా : మరేం ఫర్వాలేదు. ఒక్క పూటకేం పుట్టి మునగ దులే. (ఏడుకొండలు సంచీతో వస్తాడు)

నాంచా : (పేరయ్యతో) తీసుకోండి.

పేర : (తీసుకొని లోనికి చూస్తూంటాడు.)

నాంచా : బండికి టయమవుతోంటే, ఇంకా అట్టు జూస్తావే మయ్యా?

ఏడు : ఏంటి పేరయ్యగోరూ? ఎల్లిపోయారా?

నాంచా : నువ్వు నోరు మూసుకొని లోపలికెళ్ళరా ఏడు కొండలూ.

ఏడు : సిత్తం. (లోపలికెళతాడు.)

నాంచా : ఇక కదలవయ్యా దేముడా.

పేర : అహా. ఏంలేదు. నాయుడుగారితో చెప్పి పోదామని.

నాంచా : ఏమక్కర్లా. నే చెబుతాన్లే వెళ్ళు. ఆయన జపం మీదున్నాడు.

పేర : అలాగే [నెమ్మదిగా వెళుతూంటాడు.]

[లోపలనుండి రామానుజయ్యగారు ఆదుర్దాగావస్తాడు. అయన వెనకనే ఏడుకొండలువస్తాడు.]

రామా : ఆఁ ఆఁ! అదేమిటండీ పేరయ్యగారూ! ఎక్కడికి?

పేర : (ఆగి) ఎక్కడికో వెళ్ళే గ్రహచారం నాకేంపట్టింది? నా యింటికి వెడుతున్నాను. (వెళ్ళబోతాడు.)

రామా : (దగ్గరగావెళ్ళి బతిమాలుతూ) మా అపరాధ మేమ యినావుంటే మన్నించండి.

పేర : మీ తప్పేముంది బాబూ! ఈ ఇంటికి రావటం నాదే తప్పు. సెలవు. (వెళ్ళబోతుంటాడు.)

రామా : (చెయ్యి పట్టుకొని) ఆగ్రహించకండి. విషయమే మిటో చెప్పండి. (నాంచారమ్మతో) ఏమిటమ్మాయ్ ఇదంతా? నువ్వేమైనా అన్నావా?

నాంచా : ఏమన్నా అసలేమేం? వెళ్ళిపొమ్మన్నాను.

రామా : ఆఁ!

నాంచా : ఏం ఎందుకనను? నా కూతురు సుఖం చెడగొట్ట టానికి తయారవలా ఈ పెద్దమనిషి?

రామా : (పట్టలేని కోపంతో) ఛా! నోర్ముయ్. నా ఇంటి కొచ్చిన పెద్దమనిషి నవమానిస్తావా? (పేరయ్యతో) పేరయ్యగారూ: మీకు కావలిసింది నేను. వ్యవహార మంతా నాది. ఎవరేమంటే మీ కెందుకు? మీరు వెళ్ళకండి.

పేర : ఇంత అవమానం జరిగింతర్వాత......

రామా : అందుకు నన్ను క్షమించండి. (చేతులు పట్టుకొని) ఇవి చేతులుగావు.

పేర : ఆఁ ఆఁ! అంత మాటనకండి. పెద్దలు! అయినా కుర్ర వాడికి మేనరికముండగా......

రామా : అవన్నీ మీ కెందుకు? నాయిష్టమయి నేను పిలిచా నుగా!

పేర : చిత్రం.

నాంచా : అయితే నువ్వు సత్తిగాడికి నా పిల్లను చేసుకోవట్రా అన్నయ్యా? నన్నింత మోసం జేస్తావా? (ఏడుస్తుంది.)

రామా : ఏమిటి మోసం? నీ పిల్లని చేసుకొంటానని ఎప్పు డయినా హామీ యిచ్చానా? పేరయ్యగారూ! మీరు లోనికెళ్ళి స్నానం చెయ్యండి. తీసుకెళ్ళరా ఏడుకొం డలూ!

ఏడు : రాండిబాబూ! (పేరయ్య, ఏడుకొండలూ లోనికెళ తారు.)

నాంచా : అయితే నువ్వు సత్తిగాడికి నా పిల్లని చేసుకోనక్లే గదురా అన్నయ్యా?

రామా : నీ కెలాతోస్తే అలాగనుకో.

నాంచా : (దుఃఖస్వరంలో) అయితే ఈ నిముషానే, నీ వాకిట్లోనే, ఈ కాస్త ప్రాణం తీసేసుకొంటా. ఇంకా బతుకెందుకు?

నారా : (బయటనుండి వచ్చి) ఆఁ ఆఁ! అదేమిటె నాంచారమ్మొదినా; అలా దిగజారిపోతావేం చచ్చేం సాధిస్తావ్?

నాంచా : ఇంకా నే బతికెందుకు నారాయణయ్య బావా? నాఅన్నకే నేను విషమయిపొయ్యాను! (చీదేస్తుంది,)

నారా : ఏమిటి విశేషం బావా?

రామా : .........(మాట్లాడడు. కుర్చీలో కూర్చుని చుట్ట ముట్టిస్తాడు).

నారా : ఏంబావా మాట్లాడవు?

రామా : ఏంమాట్లాడాలి?

నారా : మీ చెల్లెలు గొడవేమిటాఅని?

రామా : గొడవేముంది? నువ్వే చెప్పవోయ్ పెద్దమనిషివి. నాయింటికొచ్చిన పెద్దమనిషి నవమానించటం సబబేనా?

నారా : ఎవర్ని?

రామా : ఆ వేరయ్యగారు, నాతో సంబంధం స్థిరపర్చు కొంటానని కొచ్చారని, ఆయన్ని నానామాటలుఅని, ఇంటినుండి వెళ్ళిపొమ్మంటుందా? ఇదేమయినా సబబేనా!

నారా : అదేమిటి నాంచారమ్మొదినా! అంతమాట నరసడితే యెలా?

నాంచా : నువ్వూ అలాగేఅంటావేం నారాయణయ్య బావా? మనిద్దరం అనుకొన్నదేగా?

రామా : ఏమిటి? ఇందులో నీ పాత్రకూడా వుందా నారాయణమూర్తి! సరె! చూస్తాను. మీరంతా తన్నుకు చచ్చినా సరే; నా కొడుక్కి మాధవయ్యగారి సంబంధమే ఖాయం.

నారా : కాస్త ఆలోచించి మాట్లాడు బావా? అంతా నీఇష్టమేనేమిటి.

రామా : కాక? మీ ఇష్టమా? నాకొడుకు పెళ్ళికి. . .

నారా : అదే నీ కొడుకు వప్పుకోవద్దాఅని.

రామా : నాకొడుకు నామాట కాదంటాడా?

నారా : సరే, అదీచూస్తాను. పద నాంచారమ్మొదినా.

నాంచా : ఎక్కడికి?

నారా : ఈయనతో మనకేమిటి? అసలు వాడు వాడికి అనుగుదాం. సత్తిగాడిదగ్గరకే వెళదాం పద.

రామా : వెళ్ళండి. ఎక్కడికైనా వెళ్ళండి. ఎవరెలాచచ్చినా సరే! నాకొడుక్కి మాధవయ్యగారి సంబంధమే ఖాయం.

నారా : సరే నేనూచూస్తాను. నువ్వెలా ఈ పెళ్ళిజేస్తావో? (లోని కెళతాడు పేరయ్య. ఏడుకొండలు లోపలనుండి వస్తాడు.)

రామా : ఇదుగో పేరయ్యగారూ!

పేర : బాబూ!

రామా : రాత్రిబండికి మాధవయ్య బావగార్తో స్తేసరే! లేక పోతే రేపుదయమే మనం తెనాలివెడదాం.

పేర : చిత్తం.

రామా : అక్కడే వ్యవహారం పైసలుజేసుకొని, ముహూర్తం పెట్టిద్దాం. ఈ నెలలో పెళ్ళిజరిగితీరాలి.

పేర : అలాగే!

రామా : రామానుజయ్య నాయుడంటే అల్లాటప్ప అను కొంటున్నాడు! నా కొడుకు పెళ్ళికికూడా నా ఇష్టం కాదట! ఒరేయ్ ఏడుకొండలూ!

ఏడు : నా నిక్కడేవుండాను బాబూ!

రామా : పోస్టాఫీసుకెళ్ళి, ఒక కవరుతీసుకరా. వెంటనేరమ్మని అబ్బాయికి వుత్తరం రాయాలి. ఇంక. (చిల్లరతీసి యిస్తాడు) (ఏడుకొండలు వెళ్ళబోతుంటాడు)
ఒరేయ్ ఏడుకొండలూ!

ఏడు : అయ్యా!

రామా : వద్దులే రా. కవరయితే లేటవుతుంది. ఏకంగా వైరిద్దాం.

ఏడు : సిత్తం.

నారా : (లోపలనుండి సంచితో వచ్చి) నే పడుతున్నా నాంచారమ్మొదినా.

నాంచా : నేనుమాత్రం మిక్కడెందుకు. నేనూ వస్తాను. వుండు కలిసే వెళదాం (లోపకెళ్ళుతుంది)

రామా : వెళ్ళండి. నిక్షేపంగా వెళ్ళండి. నన్నేం బెదిరిస్తారా?

ఏడు : అదేంటిబాబూ! సెల్లమ్మగోరు......

రామా : ఏడుకొండలూ!

ఏడు : అయ్యా!

రామా : నువ్వు నోరుమూసుకో కాస్సేపు.

ఏడు : సిత్తం.

పేర : కాని చూశాపు అన్నయ్యగారూ!

రామా : ఏమిటది?

పేర : తొందరపడి అయిన వాళ్ళను......

రామా : మీరు తెలియచూసుకోండి పేరయ్యగారూ!

పేర : చిత్తం.

(నాంచారమ్మ ట్రంకుతో తిరిగి వస్తుంది.)

నాంచా : పద నారాయణయ్య బావా. తోడబుట్టినదాన్ని ఉసూరుమనిపించి ఏం బావుకుంటాడో చూస్తాను.

ఏడు : భోజనం సెయ్యండి అప్పమ్మగారూ!

నాంచా : ఇంకా ఈ కొంపలో గంగ ముడతానట్రా!

రామా : మంచిది. (నారాయణయ్య, నాంచారమ్మ వెళ్ళి పోతుంటారు. బయటనుంచి పోస్టుమేన్ కేక వినిపిస్తుంది.) నారాయణయ్య, నాంచారమ్మను ఆగమని సైగ జేస్తాడు.

రామా : ఉత్తరమేదో వచ్చింది లాగుంది చూడరా.

ఏడు : (బయటకెళ్ళి కవరుతో తిరిగొస్తాడు) ఇదుగోండి.

రామా : (అందుకొని, పరిశీలించి) అబ్బాయే రాశాడు!

ఏడు : ఏం రాశాడు బాబూ?

రామా : ఉండరా చదవందే!

(చింపి చూస్తాడు. ఒక ఉత్తరం, ఫోటో వుంటాయ్. ఆదుర్దాగా ఉత్తరం చదివి)

కొంప మునిగిందిరా ఏడుకొండలూ!

(బిగ్గరగా అరచి కూలబడతాడు.)

ఏడు : ఏంది బాబూ!

నాంచా : ఏమిట్రా అన్నయ్యా?

నారా : ఏం జరిగింది బావా?

వీర : ఏమిటండీ విశేషం? (అంతా ఆదుర్దాగా దగ్గరకొస్తారు)

రామా : ఏం చెప్పను నారాయణయ్యా! నీ అల్లుడు నాకొంప నిలువునా ముంచాడు.

నారా : ఏం జరిగింది బావా?

రామా : ఏం జరగకూడదో, అదే జరిగింది. యిటు చూడ (లెటరందిస్తాడు.)

నారా : [అందుకొని లోలోపలే గబగబా చదివి] అరిపిడుగ ఎంతపనిజేశావురా!

నాంచా : ఏమిటి నారాయణయ్యబావా?

ఏడు : పైకి సదవండిబాబూ.

నారా : ఇంకా చదివేదేముందిరా ఏడుకొండలూ! వి సత్తెంబాబు ఒక కాలేజీపిల్లని ప్రేమించి పెళ్ళిచేసు కొన్నాడట! ముందుగా చెబితే వాళ్ళనాన్న వప్పుకోడ పెళ్ళయింతర్వాత వుత్తరం రాశాడు.

ఏడు : ఆఁ!

నాంచా : నిజంగానా నారాయణయ్యబావా?

నారా : నీమీద ఒట్టు. నాంచారమ్మొదినా ఇదుగో ఫోటో కూడా పంపాడు.

నాంచా : కొంపముంచావుకదరా సత్తిగా! (భోరుమంటుంది.

పేర : కాలమే మారిందిలెండి, ఈకాలంలో ఇలాంటివి సహ జంగా జరిగిపోతూనేవున్నాయి.

ఏడు : మొత్తానికి పిట్టపోరూ పిట్టపోరూపిల్లి తీరిసింది లెండిబాబూ!

[ తెర ]



# పిట్టపోరు

## (నాటిక)

రచన:

గన్నిశెట్టి వెంకటేశ్వరరావు

ప్రకాశకులు:
ఉదయసాహితి పబ్లికేషన్స్
విజయవాడ-1.

# పిట్టపోరు

(నాటిక)

రచన:

గన్నిశెట్టి వెంకటేశ్వరరావు

ప్రకాశకులు:
ఉదయసాహితి పబ్లికేషన్స్
విజయవాడ-1.

# పిట్టపోరు

(నాటిక)

రచన:

గన్నిశెట్టి వెంకటేశ్వరరావు

ప్రకాశకులు:
ఉదయ సాహితి పబ్లికేషన్స్
విజయవాడ-1.

# పిట్టపోరు

(నాటిక)

రచన:

గన్నిశెట్టి వెంకటేశ్వరరావు

ప్రకాశకులు:
ఉదయసాహితి పబ్లికేషన్స్
విజయవాడ-1.